REGD. No. MNL 18 ESTD. 1930 2-8-1991 శుక్రవారం రు. 1.50 లు

# జమీన్ రైతు

సంపుటి: 62 సంచిక: 31 స్థాపకులు: నెల్లూరు వెంకట రామానాయుడుగారు మేనేజింగ్ ఎడిటర్: నెల్లూరు శ్రీరామమూర్తి సంపాదకుడు : నెల్లూరు డోలేంద్ర ప్రసాద్





31 తేది సైదాపురం చెరువు ఎత్తిపోతల పథకానికి శంకు స్థాపిస్తున్న ముఖ్యమంత్రి ఎన్. జనార్ధనరెడ్డి, శ్రీమతి రాజ్యలక్ష్మి, చదలవాడ కృష్ణమూర్తి

## మంత్రివర్గ విస్తరణే సర్వరోగ నివారిణి

# అసమ్మతి అణిగి ఆశలు పెరిగాయి!

రాష్ట్ర కాంగ్రెస్ రాజకీయాలలో దావానలంలా భగ్గున మండిన అసమ్మతికార్చిచ్చు చప్పునచల్లారిపోయింది. నివురుగప్పిననిప్పులాగా లోపలే రగుల్కొంటున్నదని సానుకూల పవనాలు వీయగానే భగ్గుమంటూ సెగలు విరజిమ్ముతుందని డాక్టర్ వై.ఎస్. రాజశేఖరరెడ్డి నమ్మబలుకుతున్నప్పటికీ, తాత్కాలికంగా నైనా అసమ్మతీయులపైన ముఖ్యమంత్రిదే విజయమని తేలిపోయింది. ఏ అసమ్మతి నాయకుడితోనూ చర్చలు జరపకుండా, ఎవరి కోర్కెలకూ సమ్మతి తెలుపకుండా, ఎవరి వత్తిళ్ళకూ తల వగ్గినట్లు కన్పించకుండా, వింతంగా, గంభీరంగావుండి అసమ్మతి అస్త్రాన్ని పి.వి. పాశుపతాస్త్రంతో తిప్పికొట్టాడు ముఖ్యమంత్రి.

రాజకీయంగా శ్రీ జనార్ధనరెడ్డికి దొరికిన అమూల్య అవకాశం ఇది. ముఖ్యమంత్రిత్వం దేవుడిచ్చినవరమైతే, ముఖ్యమంత్రిత్వాన్ని నిలుపుకోవడానికి దేవతలు కరుణించిన దివ్యావకాశం ఈ విజయం. రాష్ట్ర కాంగ్రెస్ చరిత్రలో ఏ ముఖ్యమంత్రికీ అసమ్మతిదాడినుంచి ఇంతగొప్ప రిలీఫ్ లభించలేదు; స్థిరపడే అవకాశం దొరకలేదు. తన ముఖ్యమంత్రిత్వ పదవిని పదిలంగా, ప్రజాకర్షకము చేసుకొనే బాధ్యత ఇక సాంతం ముఖ్యమంత్రిదే. ఆయనిప్పుడు తీసుకొనేచర్యలు, పరిపాలనలో చూపే సామర్థ్యం, పదిమందిని కూడగట్టుకొనే నేర్పులపైనే రాష్ట్రపరిస్థితి, స్థిరత్వము ఆధారపడివుంటాయి.

### హైదరాబాదు లేఖ

ఈ కృషిలో ప్రథమఘట్టం మంత్రివర్గ విస్తరణ. ఏడునెలల నుంచి అప్పుడా, ఇప్పుడా అన్నట్లు వూగిసలాటలో పడి పోయి వున్న ఈ పుణ్యకార్యం కాంగ్రెస్ లోని అన్నిరోగాలకు మందుగా పనిచేసే పరిస్థితులు కన్పిస్తున్నాయి. మంత్రిపదవుల పంపకంలో తగినవాటాలందిస్తే చెన్నా

—తరువాత 7 పేజీలో

# కోర్కెలన్నీ తీరుస్తానన్నాడు!

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధనరెడ్డి మూడురోజుల సుడిగాలి పర్యటన శాంతియుతంగా జరిగిపోతున్నది. కావలి శివాలయంలో వాయుగుండంగాపుట్టిన ఈ పర్యటన తుఫాను దక్షిణముఖంగా పయనిస్తూ ఈ వార్త వ్రాసే సమయానికి సర్వేపల్లిలో కేంద్రీకృతమైవుంది. ఈరోజు (2 తేది) రాత్రి మరింత వేగంతో దక్షిణదిశగా పయనించి రామాపురం దగ్గర ఆంధ్రతీరం దాటుతుంది. మద్రాసులో ఢిల్లీ విమాన మెక్కడంతో సుఖాంతమౌతుంది. ముఖ్యమంత్రిగారి పర్యటన తుఫాను నెల్లూరును కుదిపివేస్తున్నా, జిల్లా రాజకీయ వాతావరణంలో పెద్దమార్పులేమీలేవు; తీరంలో నష్టపోలేదు. పత్రికలు నాయకులకు ప్రమాదహెచ్చరికలూ లేవు. కాని విశేషంగా రాజకీయ సముద్రంలో గాలింపు కొనసాగించుకోవచ్చునని ట్రంకురోడ్డు రాజకీయ పరిశోధనా కేంద్రం తెలియజేస్తున్నది. ఎన్నికలు ఏసిరినా పడవేసే అవకాశం లేదన్నదికూడా ఆ కేంద్రం కోస్కం.

> ## జిల్లాలో మూడురోజుల ముఖ్యమంత్రి పర్యటనాతుఫాన్!

జనార్ధనరెడ్డిగారిది నిజంగా తుఫాను పర్యటనే! జిల్లా ఆమూలనుంచి ఈమూలకి, ఈమూలనుంచి ఆమూలకి పరివారాన్ని పాదాలకు పసరుపూసుకొని తిరిగినట్లు తిరిగేశారు ముఖ్యమంత్రి. ఆయన హెలికాప్టర్ వేగానికి, సభల పరంపరకు అధికారులకు దిమ్మతిరిగిపోయింది; పరుగులు పెట్టలేక చచ్చిపోయారు. ముఖ్యమంత్రి అయినతర్వాత తన సహజసిద్ధమైన స్పీడును ప్రదర్శించడం ఇదే ప్రథమం. ముఖ్యమంత్రి సభల తీరుచూస్తే రాజ్యసభ సభ్యుడుగా జరిపిన పాదయాత్రలు గుర్తుకొచ్చాయి. అప్పుడు, ఇప్పుడు, అనంసం వరెడ్డిగారే వెలిగారు. తేడా అల్లా. ఆ రోజుల్లో జనార్ధనరెడ్డి ప్రజలతో కలిసిపోయేవారు. ఈరోజు ప్రజలకు, ఆయనకుమధ్య పోలీసులు దడికట్టారు; అప్పుడు కారులో, కాలినడకన తిరిగారు. ఇప్పుడు హెలికాప్టర్ లో ఎగిరారు. ముఖ్యమంత్రి హోదాలో పదుగెత్తి ఇన్ని సభలు జరిపించడం అసంభవమేకాని. కావలివంటి చిన్నటౌన్లో కూడా మూడుహెలిపాడ్ లు కట్టి జనం కళ్లరక్తాలతో ఎర్రబడేట్లుచేయడం అవసరమా అన్నదే సందేహం; మెహర్బాని కోసం అధికారులు తీసుకునే ఇటువంటి నిర్ణయాలు రాజకీయంగా ప్రమాదం కొనితెస్తాయి. జనార్ధనరెడ్డిగారు తన పర్యటన రూపకల్పనలో కొంత జాగ్రత్తపడడం అవసరం!

ముఖ్యమంత్రి అయినతర్వాత జిల్లాకు ఏమీ చేయలేదన్న అపప్రథ, అసంతృప్తి ఈ పర్యటనతో తొలగిపోయాయి. జిల్లాకుపకరించే పలు పథకాలను ప్రకటించి వెళ్ళారు. వాటిలో ముఖ్యమైనవి - సోమశిల ప్రాజెక్టు పూర్తి ప్రపంచబ్యాంకు నిధులతో పెన్నడెల్టా ఆధునీకరణ ఎన్. ఆర్. ఐ. నిధులతో నెల్లూరులో మెడికల్ కాలేజి. దంత వైద్యకళాశాల, కృష్ణపట్నం రేవు అభివృద్ధికి ఓవర్ సీస్ మెరైన్ డెవలప్మెంట్ ద్వారా సమీకరణ, కృష్ణపట్నం థర్మల్ స్టేషన్ ప్రతిపాదన ప్రపంచబ్యాంకు పరిశీలనకు తీసుకరావడం, నెల్లూరు బైపాసురోడ్డుకు 8 కోట్ల 80 లక్షల నిధులు మంజూరు... చెప్పుకుంటూపోతే జనార్ధనరెడ్డిగారు జిల్లా

—తరువాత 7 పేజీలో

# సంస్మరణ



మా అభివృద్ధికి నిరంతరం శ్రమించి
మా ఉన్నతికి కారకులైన

## శ్రీ కొండా రామచంద్రారెడ్డిగారు

రిటైర్డు పబ్లిక్ ప్రాసిక్యూటర్—నెల్లూరు

స్వర్గస్థులై 8-8-91 తేదికి సంవత్సరం నిండింది.
వారిని సంస్మరించుకొంటూ, వారి ఆత్మశాంతికై
భగవంతుని ప్రార్థిస్తున్నాము.

---

కొండా సుజాతమ్మ-భార్య

---

కుమారులు-కోడళ్ళు
కొండా శివకుమార్ రెడ్డి-ప్రసన్నలక్ష్మి
,, హరిప్రసాద్ రెడ్డి-పద్మ
,, నాగార్జునరెడ్డి-చెంచులక్ష్మి,
,, రవీంద్రచంద్రారెడ్డి-మాధవి

కుమార్తెలు-అల్లుళ్ళు
యం. ఉమ-జయరాంరెడ్డి
శ్రీమతి కుందా లీల

మనుమలు : వంశి, ధీరజ్ రాం, దీపక్ రాం, రవికిరణ్, శేషు
మనుమరాలు : స్ఫూర్తి మరియు బంధుమిత్రులు.

# జమీన్‌రైతు

## కావేరి కలహం

కావేరి జలాల పంపకం విషయంలో కర్ణాటక, తమిళనాడు ప్రభుత్వాలమధ్య వచ్చిన పేచీ ముదిరి కొండెక్కుతున్నది. బంగారప్ప, జయలలిత లిద్దరూ ఇరుగుపొరుగురాష్ట్రాల ముఖ్యమంత్రులవలెకాక, శత్రు దేశాల సైన్యాధ్యక్షులవలె కదనరంగానికి కాలుదువ్వుతున్నారు. ఇరుగు పొరుగు రాష్ట్రాలమధ్య నీళ్లకోసం పేచీలు తలెత్తడం మామూలేకాని, అది పెద్ద రాజకీయవివాదమై ఇద్దరు ప్రభుత్వాధినేతలమధ్య వ్యక్తిగత స్పర్థగా పరిణమించడం ఇదేప్రథమం.

కావేరినది కర్ణాటక, తమిళనాడు రాష్ట్రాలు రెంటిం లో ప్రవహిస్తున్నప్పటికీ, తమిళనాడుతోనే దానికి అనుబంధం ఎక్కువ. ఆ రాష్ట్రంలో నీటిపారుదల సౌకర్యం కల్పించే ఒకేఒక చెప్పుకోదగ్గనది కావడమేకాదు. తంజావూరు ప్రజల జీవనంతో, సంస్కృతితో తరతరాలుగా అనుబంధం పెనవేసుకొన్న నది, కావేరి!

కాని కావేరినది కర్ణాటకరాష్ట్రం మీదుగా తమిళనాడులోకి ప్రవేశించాలి. దానిపై వారూ కృష్ణరాజసాగర్ వంటి ప్రాజెక్టులు కట్టి వున్నారు. వారికీ కావేరిజలాలు అవసరం. కేరళ, పాండిచ్చేరీలు సైతం కావేరినీళ్ళు వాడుతున్నప్పటికీ, పెద్దమొత్తంలో వినియోగించేవి ఈ రెండు రాష్ట్రాలే. వీరిద్దరిమధ్య నీళ్లవివాదం ఈనాటిదికాదు- శతాబ్దం పైనుంచి నలుగుతూవున్నదే! వివాద పరిష్కారంకోసం కేంద్రప్రభుత్వం ట్రిబ్యునల్‌ను నియమించింది. దాని తీర్పు ఇంకా వెలువడలేదు. మధ్యంతర తీర్పుగా కర్ణాటక, తమిళనాడుకు 205 టి. ఎం. సి. ల నీళ్ళివ్వాలని ట్రిబ్యునల్ ఆదేశించింది. ఈ నీళ్ళు వెంటనే విడుదలచేస్తే తంజావూరులో ఎండిపోతున్న పైర్లు ఊపిరిపోసుకుంటాయి. ఇన్ని నీళ్ళిస్తే తమపైర్లు మాడిపోతాయని బంగారప్ప భయం. అంతువల్ల ట్రిబ్యునల్ మధ్యంతర తీర్పును నిర్వీర్యంచేస్తూ ఆర్డినెన్స్ జారీచేశారు. దీనిపై జయలలిత మండిపడింది. ఇద్దరిమధ్య ఉద్రేకాలు పెరిగిపోయాయి. మధ్యంతర తీర్పుప్రకారం నీళ్ళు ఇస్తే తప్ప చర్చలకుకూడా రానుపొమ్మని జయలలిత భీష్మించుకొని కూర్చున్నది. తమిళ ప్రజల మనోభావాలకనుగుణంగా అన్నిపార్టీల నాయకులూ కర్ణాటకపై విషం వెళ్ళగక్కుతున్నారు. కేంద్ర మంత్రి కె రామమూర్తి రాజీనామా చేశారు. ఎ. ఐ. ఎ. డి. ఎం. కె. ఎంపీలు రాజీనామా బెదరింపులు చేస్తున్నారు కర్ణాటక ఎంపీలూ అదే వుద్రేకంతో ప్రకటనలు చేస్తున్నారు.

ఇప్పుడు కేంద్రం పరిస్థితి కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకుకోపం అన్నట్లుంది. రెండు ప్రభుత్వాలూ తనకు కావలసినవే. ఎవర్నీ నొప్పించలేరు- ఎవర్నీ ఒప్పించనూలేరు. సమస్య నానువుడులో పడిపోయింది రోజులు గడిచేకొద్దీ కర్ణాటక, తమిళ ప్రజలు పరస్పరం శత్రువులుగా భావించుకొనే విషపూరితవాతావరణం ఏర్పడుతున్నది

అసలే అస్తవ్యస్తంగావున్న దేశరాజకీయవ్యవస్థను, ఈ రెండు రాష్ట్రాల వివాదం మరింత చెదరగొడుతున్నది. దీన్ని ఎక్కువకాలం కొనసాగనివ్వడం దేశానికే క్షేమంకాదు. నయానకాని, భయానకాని ఇద్దరు ముఖ్యమంత్రులను చర్చావేదికపైకి రప్పించి ఉభయ రాష్ట్రాల రైతాంగానికి న్యాయసమ్మతమైన నీళ్లవాటా పంచియివ్వడం కేంద్రం కర్తవ్యం. ఎ. ఐ. ఎ. డి. ఎం. కె ఎంపీల రాజీనామాద్వారా మెజారిటీ లేకుండాచేస్తామని జయలలిత చేస్తున్న బ్లాక్‌మెయిలింగ్ పూర్తిగా అవాంఛనీయమైనది. ఈ 11 మంది ఎంపీలూ లేనంతమాత్రాన పి. వి. నరసింహారావు ప్రభుత్వానికి జరిగేనష్టం ఏమీలేదు. ఆయన ప్రభుత్వం పతనం బి. జె. పి, జనతాదళ్ పార్టీల దయాదాక్షిణ్యాలపై ఆధారపడివుందితప్ప, ఎ. ఐ. ఎ. డి. ఎం. కె పైన కాదు.

బంగారప్ప కూడా కయ్యానికి కాలుదువ్వడం మంచిదికాదు ట్రిబ్యునల్ తీర్పు నచ్చకుంటే చర్చలద్వారా పరిష్కారం వెతికివుండవచ్చు. అంతేతప్ప పుర్దజపైలకికిడిగితే- అది రెండురాష్ట్రాల ప్రజల మనసులలో విపరీతాలునాటి స్నేహసౌహార్దభావాలను నశింపజేస్తుంది.

ప్రధాని శ్రీ పి వి నరసింహారావు రాజనీతిచతురతకు ఇదొక పరీక్ష. దేశ సంక్షేమందృష్ట్యా ఆయనీసమస్యను నేర్పుతో మెళకువతో సామరస్యంగా పరిష్కరించాలి. లేకుంటే నీళ్లకోసం ఇతరరాష్ట్రాలుకూడా పేచీలు పెంచుకొని ఫెడరల్ వ్యవస్థకే భంగం తెస్తాయి. దేశం విచ్ఛిన్నమౌతుంది.

---

## జమీన్‌రైతు

1-8-1941

10 పేజీలు అణా

### నెల్లూరు ముచ్చట్లు

పల్లిపాడు ఆశ్రమం

"నీకేతను నాకేతను

వరమడిగినకుంతిచేత నాదానవుచేత" అన్నట్లు పల్లిపాడు ఆశ్రమంకూడా "అచేతను, యాచేతను

పరమడిగిన తిక్కవరపు-వారల చేతన్" గుటకాయస్వాహా అయింది. సత్యసంధుడు, అపరశిబి అని ఆశ్రమ ఆస్తిని జగదేవిపేట వాస్తవ్యుడున్నూ మా పినాకృష్ణ మిత్రుడున్నూ అయిన వచ్చి అహా. అంతే అపరిపక్వాహారి తిక్కవరపు వెంకటరెడ్డిగారి చేతులో పెడితే, పెద్దమనిషి అయినవాడు లెక్క చెప్పారెవా పసిలేదా కొండా వెంకటప్పయ్యగారు వ్రాయగా, వ్రాయగా, వెన్నెలకంటి రాఘవయ్యగారు ప్రయత్నించగా, ప్రయత్నించగా, లెక్కాపక్కాలేదని రు 100 లు మాత్రం నిల్వలోవుందని వారికి పంపాడట. ఇదెక్కడి సత్య సంధత్వమండీ?

### 5 వ ఆంధ్రరాష్ట్ర జమీన్‌రైతు మహాసభ

28 తేది తునిలో దిగ్విజయంగా జరిగెను.

10 ఎస్టేట్ల నుండి ప్రతినిధులు విచ్చేయుట

28తేది తుని జార్జికోరనేషన్‌స్ట్రీటులో అరుగులపై పరచిన పట్టలు, చాపలు దూదిపరుపులు, మామిడితోరణం తోరణాలు తిలకించినవారికి నిజమైన కార్యక్రమ విలువ తెలుస్తుంది. ఉ॥ 9 గం॥ నుండి 12 గం॥ల వరకు విషయ నిర్ధారణ సభ జరిగింది. భోజనానంతరం 3 గం॥ నుండి జమీన్‌రైతు మహాసభ ప్రారంభం. సభకు పిఠాపురం, విజయనగరం, గొల్లప్రోలు, తుని, వెంకటగిరి, చెముడు, గాదిజీవారి ఎస్టేటు

### 50 ఏళ్ల క్రితం ఈ వారం

మున్నగు జమీందారీల నుండి 500 మంది ప్రతినిధులు విచ్చేసిరి. సభాధ్యక్షులు నెల్లూరు వెంకట్రామానాయుడు.

### స్టుడియో వార్తలు

రోహిణి

రోహిణి గర్వంతో ఉంది. "అమృత హస్తమ్" "సత్యమేవ జయం" ఈ రెండు చిత్రాలను తీయనుందట. ప్రథమ చిత్ర ప్రసవం సెప్టెంబరులో నంటున్నారు.

పార్వతి

మూడింగ్ ఈలోపల పూర్తి అయినా సమయంతోనే విడుదలట.

### రంగాగారి క్షేమం

వేలూరు జైల్లో డిటెన్యూగా వున్న ఆచార్య రంగాగారిని భారతదేవిగారు, రంగాగారి తమ్ముడు లక్ష్మీనారాయణ గారు, 30 తేది దర్శించారట. ఆరోగ్యంగావున్నారు.

### పెట్రోలు కంట్రోలు

హిందూ దేశములో ఆగస్టు 15 తేది నుండి పెట్రోలు కంట్రోలు ప్రారంభమగుననియు మధరుగా వ్యాపారస్తులకు వగైరాలకు తగినంత వ్యవధినొసంగబడుననియు తెలియుచున్నది.

### రేవాల బోర్డు

ప్రెసిడెంటును మా పంచాయతీ బోర్డు దర్శించి 4 మాసాలైవుంటుంది. మా వీధులు దీపాలుమాని 8 నెలలైవుంటుంది బోర్డు మీటింగును చూచి ఎన్నినెలలైవుంటుందో. ఠలావుండే పల్లెటూర్ల బాగు పడే మార్గమెట్లా?

—ఓటరు

### చెన్నూర్నారు తలరా

ఇద్దరు మాత్రం దరిపోయినారు. ఇప్పుడు వూరులో ఏమీలేదు. బాగుంది.

### హరిజనులు-పబ్లికు సంస్థలు

హోటళ్ళలోకానీ, ఇతర బహిరంగ స్థలాలలోకాని హరిజనులను రానీక పోతే అట్టివారికి లైసెన్సులు రద్దుచేయబడునని నవాబ్‌షా జిల్లా కలెక్టరుగారు ప్రకటన చేసిరి.

---

# దేశంకోసం రైతు నష్టపడాలికాని, రైతుకోసం దేశం కష్టపడకూడదా?

ప్రకృతి వైపరీత్యాలు, గిట్టుబాటుకాని ధరలు, పెరిగిన కూలిరేట్ల వంటి సవాలక్ష సమస్యలతో సతమతమౌతున్న రైతాంగంపై ఎరువులధరల పెంపు అనే గుదిబండ వేశారు. రైతు అంటే అందరికీ ఇంత కసిదేనికో అర్థంకాదు రైతులమీద, గ్రామాలమీద ఆధారపడి కోట్లుసంపాదించే వారికి కూడా రైతులంటే సానుభూతిలేదు ఎమ్మెల్యేలు, ఎంపీలు ఈ అన్యాయాన్ని ఖండించడంలేదు ఏ పార్టీ ప్రభుత్వానికి వచ్చినా రైతుకు ఒరిగేదేమీలేదని తేలిపోయింది.

పారిశ్రామిక వస్తువుల ధరలను బట్టి ఆహార ధాన్యాల ధరలు నిర్ణయిస్తే ఎవరూ దేహీ అనరు రైతులు స్వేచ్ఛగా తమ పంటను దేశంలోకాని, విదేశాలలోకాని అమ్ముకునే వీలుకల్పిస్తే ఏ ప్రభుత్వ సబ్సిడీలూ అవసరం లేదు ధాన్యం ఎగుమతికి అనుమతిస్తే దేశంలో ఆహారధాన్యాల కొరత ఏర్పడుతుందని ప్రభుత్వ భయం దేశంకోసం రైతు తన కువచ్చే అధిక లాభాన్ని వదలుకోవాలేతప్ప- రైతుకోసం దేశం తరఫున ఏదీ వదలడానికి ప్రభుత్వానికి ఇష్టం లేదు. ఎమిటీ అన్యాయం? ధాన్యం ఎగుమతులు అనుమతిస్తే రైతుకు ఎవరి ప్రమేయమూలేకుండా గిట్టుబాటు ధర లభ్యమౌతుంది. ప్రభుత్వానికి విదేశీ మారకద్రవ్యం లభ్యమౌతుంది. ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీలపై ఆధారపడాల్సిన అగత్యం వుండదు. ఎరువుల ధరలు పెంచారన్న ఆందోళన వుండదు ధాన్యానికి ధరపెరిగితే వ్యవసాయంలో శాస్త్రీయ పద్ధతులు ప్రవేశ పెట్టడానికి వీలౌతుంది. ధాన్యం ఉత్పత్తి దానంతట అదే పెరుగుతుంది. గ్రామాలు సౌభాగ్యంతో కళకళలాడుతాయి రైతులు ఆనందంగా వుండగల్గుతారు కూలీల జీవన ప్రమాణాలు పెరుగుతాయి. కూలీ



ఎక్కువ పెరుగుతుంది. గ్రామాలనుంచి పట్టణాలకు వలసవచ్చేవారి సంఖ్య తగ్గుతుంది.

గత పాతికేళ్ళలో పెరిగిన పారిశ్రామిక వుత్పత్తుల ధరలకు, ధాన్యంధరలకు పోలికవుందా? ప్రపంచ మార్కెట్‌తో పలికే, ధాన్యంధరక జాతీయ మార్కెట్‌లోని ధరకు తేడా ఎంత? దేశంలో ఆహార కొరత ఏర్పడుతుందని ఎల్లకాలం రైతులు తమ కడుపుకాల్చుకొని దేశానికి తిండి పెట్టవలసిందేనా? అటువంటి రైతుకోసం 7 వేల కోట్లు ఎరువుల సబ్సిడీ భరించడం ప్రభుత్వం ధర్మంకాదా? ధాన్యం ఎగుమతులపై ఆంక్షలవల్ల రైతు నష్టపోతున్న లాభంతో పోలిస్తే ఈ 7 వేలకోట్లు పెద్ద మొత్తమా? ఉత్పత్తికి సరైనధర నిర్ణయించకుండా ఉత్పత్తి వ్యయంమాత్రం

—తరువాయి 10వ పేజీలో

---

## దివ్య సంస్మరణ

కీ. శే. సూరపనేని రామయ్యగారు

నిర్యాణం 8-8-1990

నీవు శాశ్వతంగా మమ్ములను విడిచిపోయి సంవత్సరం గడిచింది.

- నిన్ను సంస్మరించుకొంటూ -

సోదరుడు : సూరపనేని లక్ష్మయ్యనాయుడు. మరదలు : కౌసల్యమ్మ

అల్లుడు : ఉన్నం గోవర్ధన్, కుమార్తె : ఇందిర

అల్లుడు : కోనంకి అమీనయ్య, కుమార్తె : మాధురి

మరియు బంధుమిత్రులు-సరస్వతి నగర్, దర్గామిట్ట-నెల్లూరు.

# నాయుడుపేట సబ్‌ట్రెజరీలో రక్తం పీల్చే లంచాల జలగలు!

అవినీతి పెరగటంతో కలుషితమైపోయిన ప్రభుత్వ కార్యాలయాల్లో ట్రెజరీలకు ద్వితీయ స్థానమో, తృతీయస్థానమో లభిస్తుంది. పిటిషన్ల, వాణిజ్యపన్నుల, రిజిస్ట్రేషన్, ఎక్సైజ్ వంటి శాఖలు కంపుకొట్టే కాలం వచ్చినదే దీనికిస్థానం. అందువల్ల ఆ గొంగళిలో వెంట్రుకలేరడం వరకు దండగని తెలిసినా-ఒక ప్రతీక్ష ఉద్యోగులరక్తాన్ని జలగలమాదిరి పీలుస్తున్న నాయుడు పేట సబ్‌ట్రెజరీగురించి వ్రాయకతప్పడం లేదు

అన్నిటి మాదిరే ఈ సబ్‌ట్రెజరీలోనూ చేతులు తడపనిదే కాగితాలు కదలవు. అయితే సాధారణంగా ట్రెజరీలలో చేసిన పనికి ఇంత అని రేటు వుంటుంది; అదీ, చేసిన తర్వాత తీసుకొంటారు. కాని నాయుడుపేట ట్రెజరీ సిబ్బంది మాత్రం ప్రభుత్వోద్యోగులు అరియర్ బిల్స్, పెన్షన్, సరెండర్‌లీవ్ వగైరాలకు సంబంధించి బిల్లులో 10 శాతం చెల్లిస్తేనే కాగితాలు చేతికి ఇస్తున్నారట. అటెండర్ల వంటి చిరుద్యోగులకు కూడా ఇదే రూటట. 10 శాతం బిల్లుమొత్తం ముందుగా పట్టి కాని పనిచేయడమన్నది ఏ ప్రభుత్వ కార్యాలయంలోకూడా లేని దోపిడి! సిగ్గు బిడియం లేకుండా పొద్దుకినుంచి దండిన ఈ దారుణ అమేధ్యాన్ని సాయంత్రంతూర్పుని పైనుంచి క్రిందివరకు వాటాలు పంచుకొంటున్నారు. ఇంత నీచంగా తయారైన ఈ ట్రెజరీ సిబ్బందిని సంస్కరించేవారు లేరా?

### రాపూరు అడవుల్లో సారా బట్టీలు

జయలలిత పుణ్యమా అని ఆంధ్ర ప్రదేశ్‌లోని నాటుసారా కంట్రాక్టర్ల మాట! సారా ప్రభువులు తమ అక్రమ వ్యాపారానికి తమిళనాడు పైకెగబడుతున్నారు.

# రాపూరుఅడవుల్లోనాటుసారా- తమిళనాడు నిషేధం మహిమ?

దాని ప్రత్యామ్నాయంగా రాపూరు అడవుల్లో సారాబట్టీలు పుట్టుకొస్తున్నాయి. స్థానిక మహిళలు సారావాహక సంచాలకులుగా తయారౌతున్నారు. వీరి చేతివేళ్ళ కేంద్ర గుమ్మడిపూడి అంటున్నారు. సారా నిషేధమా! ఏమి నీ మహిమ!

### రాపూరులో హిందీ పరీక్షలు

దక్షిణభారత హిందీ రాష్ట్ర, మధ్యమ, ప్రాథమిక పరీక్షలకు రాపూరు కేంద్రం మంజూరైంది. ఆగస్టులో జరగబోయే పరీక్షలకు యాభైమంది విద్యార్థులు హాజరవుతున్నారు.

రాపూరు చుట్టు ప్రక్కలవున్న హిందీ భాషాభిమానులకిది చక్కని సదుపాయం.

## జిల్లావార్తలు

### ఇందుకూరుపేట సన్మానాలు

ఇందుకూరుపేట ఎ పి యు యస్ కి చెందిన ఉపాధ్యాయ సంఘం, బదిలీ అయిన మండల విద్యాధికారి శ్రీ యస్. రాఘవ రావును పదవీ విరమణ చేసిన ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ పి. వెంకట సుబ్బయ్యను సన్మానించింది. సన్మాన సభకు ఉపాధ్యాయ సంఘం జిల్లా శాఖ అధ్యక్షులు శ్రీ రవీంద్రరెడ్డి అధ్యక్షత వహించారు. శాసన సభ్యులు శ్రీ సి. వి. శేషారెడ్డి, మండల అభివృద్ధి అధికారి శ్రీ కె రామచంద్రారెడ్డి, యం ఆర్. వో. శ్రీ వి వీరాస్వామి తదితరులు పాల్గొన్నారు

### ఇందుకూరుపేట చిత్రకళా ప్రదర్శన

ఇందుకూరుపేట, శ్రీ మాగుంట కోటారెడ్డి హైస్కూలులో నీహారిక చిత్రకళా సమితి, ఇందుకూరుపేట స్టూడెంట్స్ అసోసియేషన్ సంయుక్త ఆధ్వర్యంలో చిత్రకళా ప్రదర్శన ఒకటి నిర్వహించారు. హైదరాబాదు జవహర్‌లాల్ నెహ్రూ టెక్నలాజికల్ విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యనభ్యసిస్తున్న ఇందుకూరుపేటవాసి శ్రీ అక్కుకూరు రామకృష్ణ మంచి చిత్ర

# ఇందుకూరుపేట యువ చిత్రకారుడి ప్రదర్శన

కారుడు. ల్యాండ్ స్కేపులు ప్రకృతి వర్ణచిత్రాలు పైంటర్స్ అనే నూతన టెక్నిక్‌తో గీసిన దాదాపు వందలాది చిత్రాలు ఈ ప్రదర్శనలో పెట్టాడు.

ప్రదర్శనను శ్రీ వట్టిపల్లి మల్లినాథ శర్మ ప్రారంభించారు. గ్రామ పెద్ద శ్రీ పొన్నలగడ్డ మురహరిరావు చిత్రకారుడికి ఆశీస్సులందజేస్తూ మాట్లాడారు. స్కూలు హెడ్మాస్టర్ శ్రీ కె. రంగనాథం సభాధ్యక్షత వహించారు. 8 రోజులపాటు జరిగిన ప్రదర్శనను దాదాపు 2500 మంది గ్రామీణులు తిలకించారు. తన తొలి చిత్ర ప్రదర్శనను తన స్వంత గ్రామంలో జరిపించాలని శ్రీ రామకృష్ణ కోరిక అట. అది ఇప్పుడు తీరింది. రామకృష్ణ ఈ స్కూలుకు పాత విద్యార్థి కూడా!

### కొత్తూరులో కోళ్ళ సంఘం

నెల్లూరు రూరల్ మండలానికి చెందిన కొత్తూరు గ్రామంలో శ్రీ హెచ్. కె. బాబు "పౌల్ట్రీ ఫార్మర్స్ కోఆపరేటివ్ ప్రొడక్షన్ అండ్ సేల్స్ సొసైటీ లిమిటెడ్" అనే సహకార సంస్థను ఏర్పాటుచేశారు. దీనికి శ్రీ ఎస్. వి. కృష్ణయ్య అధ్యక్షుడు.

### రైల్వే ప్లాట్‌ఫారంపై గంజాయి సంచి

జూలై 21వ తేది రాత్రి 9 గంటలకు రైల్వేస్టేషన్లో హైదరాబాదు నుండి తిరుపతి వెళ్ళిపోతున్న కృష్ణా ఎక్స్‌ప్రెస్ ఆగింది. గంజాయి స్మగ్లర్ ఎవరో రైల్వేపోలీసుల్ని గుర్తించాడు. మెల్లగా బండిదిగేసి, ప్లాట్‌ఫారంపై పదానాలుగు కిలోల గంజాయి ఉన్న సంచిని వారి వదిలేసి తప్పించుకున్నాడు దాన్ని రైల్వేపోలీసులు స్వాధీన పరచుకున్నారు.

### బుచ్చి శారదానికేతన్ కవి సమ్మేళనం

జూలై 21వ తేది బుచ్చిరెడ్డిపాళెంలో శారదానికేతన్ సాహిత్య కార్యక్రమాలు జరిగాయి.

ఉదయం శ్రీ దగ్గిశెట్టి వెంకటసుబ్బయ్య అధ్యక్షతన దోర్నాదుల ఉపమ్మ కల్యాణమంటపంలో కవిసమ్మేళనం జరిగింది. శ్రీ సి. సి. సుబ్బరాయుడుశెట్టి జ్యోతివెలిగించి సభను ప్రారంభించారు. శ్రీ అగస్త్యరెడ్డి వెంకురెడ్డి, ఆచార్య శ్రీ పి సి రెడ్డి ప్రసంగించారు.

కవి సమ్మేళనంలో శ్రీ పి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి జె సి పెంచలయ్య, యరమాల ఆదిశేషారెడ్డి, బుడి విశ్వనాథం తదితర కవులు కవితాగానంచేశారు.

మధ్యాహ్నం శ్రీ కోట రాజశేఖర్ గారి అష్టావధానం జరిగింది. సభకు శ్రీ ఎ. నారసింహారెడ్డి అధ్యక్షత వహించారు.

—తరువాత 8 పేజీలో

ఉన్నతమూ ఉదాత్తమూ అయిన వ్యక్తిత్వంతో
అకుంఠిత ప్రజాసేవాతత్పరతతో
పదిహేను సంవత్సరాలు పార్లమెంటు సభ్యుడుగా
అమలిన ప్రజాజీవితం గడిపి
అశేష ప్రజల ఆదరాభిమానాలకు పాత్రుడైన


డి. కామాక్షయ్య

## స్వర్గీయ డి. కామాక్షయ్యగారు

భౌతికంగా మనకు దూరమై 3-8-91 తేదికి
తొమ్మిది సంవత్సరాలు నిండుతాయి.
ఈ తొమ్మిదవ వర్థంతి సందర్భంగా
వారి దివ్యస్మృతికి ఇదే మా

## శ్రద్ధాంజలి

—కుటుంబ సభ్యులు

నెల్లూరు నార్త్ రోటరీక్లబ్ నూతన కార్యవర్గ ప్రమాణస్వీకారోత్సవంలో కొత్త సెక్రటరీ ఎన్. బలరామయ్య, పాత అధ్యక్షుడు కె. శ్రీహరి, జిల్లాజడ్జి బి. వి. సీతారామరావు, మాజీగవర్నర్ జె. వి. రెడ్డి.




### ముఖ్యమంత్రి

ఎర్రిపూలంట్లు జిల్లాకు పేరాక
చేయదగిన పనులు చీఫ్ మినిష్టరి
అన్నీ ఎన్నోగలవు అవకాశ మొర్వాక
పూర్తి సెయ్యండి పోతూవస్తు!

### కన్వెన్షన్

అదగనోడ్ని పాపం అదుకుంటున్నావు
పేదసాదపాలి పెన్నితీవు
కవులకెల్ల బనుల్లా కన్వెషనిప్పించు
ఆంధ్ర ముఖ్యమంత్రి ఆలోచించు.

### తేనీటి విందు

హిల్లు స్టాలుల్లైంది ఈనద్య, మాగుంట
బయట రావాలంటె బాధ. లేక
పోత కవికి సేద ప్రూశాపి రసగుల్లి,
వాస్తి లేనివేళ ప్రతిది యింతె!

### నల్లపరెడ్డి

నల్లపరెడ్డి! నీదు నాయకత్వంబు ఆ
తెలుగుపార్టి జిల్ల వరమూలం,
నిజము తెలుసుకో నినుగూర్చి నెమరేస్త
పారితోషికంగ పద్యం వ్రాస్త!

### జె. కె.

రాంకాలమైంది ఈః జాపి మీకేతి
కాని రాగి మిమ్ము కలసుకోసి,
నోరు తచిలెడింది ఏరోజో వారోజు
కలుసుకుంట కాపి కరువుగుంది!

### బుచ్చి

సాగనంపె బుచ్చి సత్కారమొనరించి
కవులబట్టుకొచ్చి. కాల్దురాం
నీకు పిచ్చితండ్రి! నాకెందుకొస్తుంది
కవినిగాదు నేను కంట్లొలబడను

### పెన్న

మోసపొయ్యి కవిని మూడుముక్కాలిచ్చి
పెన్నగొన్న పొయ్యి పెదబజార్లొ
కాదు ట్రంకుకోర్టా కలిబెట్టికాల ం
ప్రతిదికూడ టౌన్లొ వచ్చిమోసం!

### నాకలోక రంభ

పైకి స్వర్గమునకంపించ దరఖాస్తు
అర్తి, రేపొమాపొ అర్థరాసది
నాకలోక నాట్యాన్నిదిలకిప్త
ఎట్నొ కొసలొ కాలమెళ్ళదీస్త!

### దర్గ

పిలిదేశ్చ్రితము పిటొయ్య దర్గాకు
అర్ధరాత్రినడిచి అయొకరోజు,
దాఃపొడుగుసుల్లు దర్శించివచ్చాను
బత్తెముండి ఎట్నొ బయటబడ్డ!

## ప్రథమ వర్ధంతి

మా కుమారుడు **శ్రీరామ పార్థసారధి**
పరమపదించి 6-8-91 తేదికి సంవత్సరం పూర్తయింది. నీవు లేనిలోటు మాకు ఈ జన్మలో తీరదు ప్రథమవర్థంతి సందర్భంలో నీ ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాము.

తల్లిదండ్రులు అత్తమామలు, మరియు కుటుంబసభ్యులు

### గూడూరు సన్మానంలో మాగుంటకు

# పూలమాలల కంటే సమస్యల తోరణాలే ఎక్కువైపోయాయి!

"గల్ఫ్ యుద్ధం - విశ్వశాంతి" అనే శీర్షికపై శారదానికేతన నిర్వహించిన పద్యరచనా పోటీలలో పాల్గొన్న విజేతలకు నగదు బహుమతినిచ్చి సత్కరించారు. ప్రథమబహుమతి శ్రీ దువ్వూరు రామలింగారెడ్డి, ద్వితీయ బహుమతి శ్రీ దోన్నిపర్తి రమణయ్యకు లభించాయి.

### గూడూరు టౌనులో మాగుంటకు ఘనసన్మానం

ఒంగోలు పార్లమెంట్ సభ్యుడు శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డిని గూడూరీయులు 27తేది ఘనంగా సత్కరించారు. డిఎన్ఆర్ కమ్యూనిటీ హాల్‌లో జగజ్జాయమానంగా జరిగిన ఈ సన్మాన సభను శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి అధ్యక్షించారు. స్థానిక న్యాయవాది, మాజీ తెలుగుదేశీయుడు శ్రీ వై. వి. చలపతిరావు స్వంత కార్యక్రమమిది. పార్టీలకంటే వ్యక్తిగత అభిమానాలకు విలువ ఎక్కువ కదా!

మాగుంట సుబ్బరామరెడ్డిగతప్ప ఇంకెవ్వరైనా ఒంగోలు సీటులో ఓడిపోయి వుండేవారని, ఆయన గుణశీలతకు, దానశీలతకు అద్భుతమైన గుర్తింపే ఈ విజయమని శ్రీ వేమారెడ్డి రామచంద్రారెడ్డి కొనియాడారు. ఎమ్మెల్యేలు శ్రీ పత్రా ప్రకాశరావు, శ్రీ జె. కె. రెడ్డి, సింహపురి సేవా సమితి కన్వీనర్ శ్రీ ఆనం వివేకానంద రెడ్డి, మాజీఎమ్మెల్సీ శ్రీ మాదాసు గంగాధరం, స్థానిక కాంగ్రెస్ నాయకులు శ్రీ ఎల్లసిరి గోపాలరెడ్డి, శ్రీ చదలవాడ వెంకటేశ్వర్లు, శ్రీ కోడూరు శ్రీనివాసులు రెడ్డి తదితరులంతా మాగుంట సుబ్బరామరెడ్డిని ప్రశంసిస్తూ మాట్లాడారు.

పూలమాలలతోపాటు, సమస్యల తోరణాలు కూడా మాగుంట సుబ్బరామరెడ్డి మెడలోపడ్డాయి ఈ సభలో! రైల్వేఓవర్ బ్రిడ్జినిర్మాణం, మద్రాసునుంచి గూడూరు వరకు ప్యాసింజర్ లోకల్ రైలు నడపడం తదితరాలన్నీ అడిగారు. అన్నిటిని ఒకే రీతిగా శ్రీ సుబ్బరామరెడ్డి ఇప్పటివరకు తోచినవారికి తోచినంత సాయం గుప్తంగా చేసుకుంటూపోతుండిన తాను, ప్రజాసేవా జీవితంలోకి రావడంతో ఎంతో బాధ్యత పెరిగిపోయిందని, ఇకమీదట ప్రజాసేవలో గడపాలని నిర్ణయించుకున్నానని చెప్పారు శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి.

### గూడూరు ఎమ్మార్వోపై అగ్నికులక్షత్రియుల ఆరోపణ

గూడూరు మండల రెవిన్యూ అధికారి శ్రీ వి వి భాస్కరరావు తమ కులం విద్యార్థులకు కుల ధృవీకరణ సర్టిఫికేట్లు ఇవ్వ నిరాకరిస్తున్నారని. ఫలితంగా ఎంతో మంది విద్యార్థులు అవస్థలపాలు కావలసి వస్తున్నదని నెల్లూరు అగ్నికుల క్షత్రియ సంఘం ప్రధాన కార్యదర్శి శ్రీ వేలూరు వెంకటేశ్వర్లు ఆరోపిస్తున్నారు. కలెక్టర్ గారూ, వాస్తవమేమిటో విచారించండి!

### అధికారులకు టురిడీ కొట్టిన నరసమ్మ

కావలికి వాయవ్యదిశగా వున్న లక్ష్మీపురం గ్రామ హరిజనవాడకు జూలై 19 తేది మధ్యాహ్నం పాతిక-ముప్పై మధ్య వయస్సుగల మహిళ వచ్చింది. మాటల్లో ఎదుటివారిని యిట్టే ఆకర్షించే మనిషి. పెట్టే కళలో ఆరితేరినట్లుంది. అక్షరాస్యత కార్యక్రమంలో పాల్గొనే అడుంధతీయులకు రెండువేల నుండి ఆరువేల వరకు జిల్లా కలెక్టరు 21 తేది అప్పులిస్తారని కాబట్టి దరఖాస్తు చేసుకోవచ్చునని నమ్మబలికి అమాయకులైన దరఖాస్తుదారుల నుండి పాతికపరకవసూళ్లే యడం మొదలుపెట్టింది. ఇంతలో అక్షరాస్యత కార్యక్రమ పరిశీలనకై కావలి మండల డెవలప్‌మెంట్ అధికారి శ్రీ కోటేశ్వరరావు అక్కడికి వెళ్ళడం తటస్థించింది. ఈ విషయం ఆయనకు తెలియగానే ఆమెను పిలిపించి నాలుగైదు ప్రశ్నలు వేయడంతో ఆమె గుట్టు బయట పడి మోసగత్తె అనితేలింది. ఆమెవసూలు చేసినడబ్బు వాపసు యిప్పించి, ఆమెను కావలి రూరల్ పోలీసు స్టేషనుకు అప్పగించారట. అప్పుడామె తాను గండవరం నివాసినని, పార్లమెంటుమెంబరై నపద్మశ్రీ బంధువునని చెప్పడంతో సబ్‌ఇన్స్‌పెక్టర్ కూడా కొంత సందేహించి, ఆ రాత్రి ఆమెకు ఒక ప్రైవేటు ఇంట అన్నపానాదులు ఏర్పాటుచేసి మరుసటి 21 తేది ఆర్. డి. ఓ. కు అప్పగించడానికి తీసికొనిపోతుండగా మూత్రవిసర్జనకని నమ్మబలికి, గోడదాటుకుపోయిన మనిషి గుట్టుగా వుడాయించేసిందట. ఆమె పేరు కాకుమాని నరసమ్మ అనీ, అరుంధతీయురాలు అనీ గండవరానికి చెందిన మనిషనీ చెప్పుకుంటున్నారు.

అక్షరాస్యత కలిగించి పల్లెప్రజలకు కొంతజ్ఞానం కలిగించాలని ప్రభుత్వం ప్రయత్నిస్తుంటే, మనవాళ్లు దాన్నికూడా తమ మోసాలకు ఒక అవకాశంగా మలుచుకోవడం విచారకరం!

> **జిల్లా వార్తలు**
> (5 వ పేజీ కొరవ)

### కాంట్రాక్టర్ పెంచలయ్యకు కావలి సన్మానం

రాష్ట్ర స్కూల్ ఎడ్యుకేషన్ డైరెక్టర్ శ్రీ కూరపాటి పెంచలయ్యను కావలి లయన్స్, రోటరీ, నందదీప్ సాయి సమాజాలు సంయుక్తంగా సన్మానించాయి.

శ్రీ పెంచలయ్య ఉపాధ్యాయ పదవి నుంచి ప్రతిభా పాటవాలతో అంచెలంచెలుగా రాష్ట్రస్థాయి వున్నతోద్యోగానికి ఎదిగారు. ఆయనను సన్మానించేందుకు ఆయనకు విద్యగరిపిన ఉపాధ్యాయులు, ఆయన వద్ద శిక్షణపొందిన ఉపాధ్యాయులు పెద్ద సంఖ్యలో వచ్చారు.

సభకు శ్రీ పెంచలయ్య చిన్ననాటి ఉపాధ్యాయులైన శ్రీ పి. చెన్నారాయుడు అధ్యక్షత వహించడం విశేషం. సభలో శ్రీ తుంగరాయశర్మ పెంచలయ్యను ఉదయగిరి కొండల్లో పుట్టిన వజ్రపు తునకగా అభివర్ణించారు. ఆంధ్ర, ఆంగ్ల భాషల పద్యాలతో సన్మాన పత్రాలు సమర్పించారు. అభిమానులు పూలమాలలతో ముంచెత్తారు.

సన్మానసభకు ముందు విశ్వోదయ పాఠశాలల దివంగత హెడ్‌మాస్టర్ కుమారస్వామి స్మారక చిహ్నంగా ఏర్పాటయిన గ్రంథాలయానికి శ్రీ పెంచలయ్య ప్రారంభోత్సవం చేశారు.

### ఎర్రచందనం పట్టివేత

చిత్తూరు జిల్లా ఏర్పేడు మండలం గొల్లపల్లి గ్రామంనుండి లారీలో అక్రమంగా రవాణా చేయబడుతుండిన నూటతొంభై ఎర్రచందనం దుంగలను అటవీశాఖ అధికారులు వెంకటగిరి సమీపంలోని మిట్టపాళెం గ్రామంవద్ద పట్టుకొని లారీతోసహా స్వాధీనం చేసుకున్నారు. పట్టుబడిన ఎర్రచందనం విలువ కనీసం నాలుగులక్షల రూపాయలుంటుంది.

ఈ పట్టివేత జూలై 22 తేది వేకువజామున జరిగింది.

తిరుపతి అటవీశాఖాధికారుల వ్యూహం వన్ని ఈ లారీని పట్టుకున్నారు. ఈ ఎర్రచందనం తమిళనాడుకి రవాణా అవుతుండిందట.

సూళ్ళూరుపేట తడ ప్రాంతాల నుండి అక్రమంగాజరిగే బియ్యం రవాణాకు ఇప్పుడు సాగా స్మగ్లింగ్ తోడయింది. శ్రీ కాలవృత్తులంతా ఈ స్మగ్లింగు కార్యక్రమంలో పూర్తిగామునిగిపోయివున్నారు. వారికిది జీవనోపాధి అయింది. విజిలెన్స్, చెక్ పోస్టు అధికారులకు చేతినిండాపని; జేబునిండా డబ్బు.

### సందేశం

**అగస్టు తిథులు**

ఆషాధ బహుళ-

| | | | | |
|---|---|---|---|---|
| 3 శని | అష్టమి | రా 11-47 | గం. వ. | |
| 4 ఆది | నవమి | రా 10-20 | ,, | |
| 5 సోమ | దశమి | రా 8-15 | ,, | |
| 6 మంగళ | ఏకాదశి | రా 6-00 | ,, | |
| 7 బుధ | ద్వాదశి | వ 3-28 | ,, | |
| 8 గురు | త్రయోదశి | వ 12-58 | ,, | |
| 9 శుక్ర | చతుర్దశి | వ 10-40 | ,, | |

-స్వయంపాకుల శ్రీనివాసులు ఎం.ఎ.

# కృతజ్ఞత



నెల్లూరుజిల్లా గూడూరు పట్టణంలో వున్న ప్రభుత్వ వైద్యశాలకు సుమారు కోటిరూపాయల ఖర్చుతో 75పడకల వైద్యశాలగా వున్నతస్థాయి కల్పించి; మున్సిపల్ ఛైర్మెన్‌గా 10 సంవత్సరాలు గూడూరు పట్టణానికి, వైద్యశాల అభివృద్ధికమిటీ అధ్యక్షుడుగా వైద్యశాలకు నిరంతరం సేవజేసిన కీ. శే. పొన్నలూరు కోటారెడ్డిగారి స్మృతి చిహ్నంగా

## "పొన్నలూరు కోటారెడ్డి ప్రభుత్వ వైద్యశాల"

గా నామకరణం చేసిన మన ప్రియతమ నాయకులు,

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

# శ్రీ నేదురుమల్లి జనార్ధనరెడ్డిగారికి

మా హార్దిక అభివందనములు

**డా॥ సి. ఆర్. రెడ్డి**
కార్యదర్శి
ప్రభుత్వ వైద్యశాల అభివృద్ధి సంఘం.
గూడూరు.

**పొన్నలూరు సనత్‌కుమార్‌రెడ్డి**
మేనేజింగ్ ట్రస్టీ
పొన్నలూరు కోటారెడ్డి ఛారిటబుల్ ట్రస్ట్
గూడూరు.

Edited, Printed & Published by N. Dolendra Prasad at the Zamin Ryot Press-Nellore.